మర్దనమును బొందవలయు ననియును జర్మని కోరు చున్నది. డిశంబరు మాసాంతమునందు పేరిసునందు గూడనున్న నష్టపరిహారోపసంఘ మేమి నిర్ణయించు నదియును కాలము తెలుపగలదు. బలవంతమైన ఫ్రాన్సుదేశమునకు జేసెడి మొఱ అరణ్యరోదనముగ నున్నది. రూరు ప్రాంతమును ఫ్రాన్సునశమును జేసిన పక్షమునకు జర్మను మొఱలను ఫ్రాన్సు ఆలకించు ననుటకు సూచనలు గానిపించుచున్నవి.

* * *

గ్రేటుబ్రిటను పరిస్థితు లయోమయముగ నున్నవి. అనుద్యోగసమస్య ప్రత్యక్షముగ దుఃఖ కారణముగనున్నది. ఈసమస్యను నిర్ణయించుటకు బాల్డ్విన్గారు పన్నిన మాయోపాయము ప్రజలను మోసపుచ్చజాలదు. సంరక్షణవ్యాపారనీతిని ప్రకటించిన బాల్డ్విను పక్షమునకు ఎన్నికలయందు పరాజయముకలిగి ఎన్నికలు ప్రయోజనశూన్యము లైనవి. కన్సర్వేటివు పక్ష సభ్యులసంఖ్య 346 నుండి 259 కి తగ్గినది. లిబరలుపక్ష సభ్యులసంఖ్య 117 నుండి147 కిని లేబరుపక్ష సంఖ్య 144 నుండి 187 కిని హెచ్చినవి. కన్సర్వేటివు పక్షపు రాజ్యనీతిని ప్రజలు నిరసించినవిధమును ఎన్నికలు రుజువుచేసి నవి. లేబరుపక్షము క్రమక్రమముగను వికసించు చున్నది. ఆదర్శములందు భేదము గల యీమూడు పక్షములందును ఏరెండుపక్షములకును సంయోగము సాధ్యముగాదు. రాజ్యభారమును నిర్వహించుటకుశక్తిలేని బాల్డ్వినుపక్షము రాజీనామా నీయక పదవులను బట్టుకొని వ్రేలాడుచుండుట విచిత్రముగ నున్నది. అనతికాలముననె తిరిగి ఎన్నికలు సంప్రాప్తమగుట సంభవముగ నున్నది. లిబరలుపక్ష విజయము సంతృప్తికరమైనను భారతదేశమున కధికమైన ప్రయోజనము గలుగదు. భారతదేశపు ముక్తి భారతదేశవాసులవలననె కలుగవలసియున్నది.

* * *

భరతఖండమునందంతటను ఎన్నికలు జరిగినవి. లిబరలుపక్షము సంపూర్ణముగ మాయమై పోయినది. నిరంకుశాధికారవర్గమునకును సహకార సోదరులకును నీ పరాజయము జ్ఞానోదయమును గలుగజేయవలసియున్నది. మంత్రులైన సర్ సురేంద్రనాథ బెనర్జి పరాంజపే చింతామణి సీతల్వాడు గారలు పరాజయమును బొందినపుడు లిబరలు పక్షపు భవిష్యము బయటపడినది. స్వరాజ్యపక్షము కొంతవఱకు విజయమును బొందినది. ఆ పక్షము వారు డిశంబరు మాసాంతమునందు కాకినాడ యందును జనవరి మాసారంభమునందు ప్రయాగ యందును గూడి కార్యవిధానమును నిర్ణయించు నటులు దేశబంధుదాసుగారు ప్రకటించిరి. స్వరాజ్య పక్షమునందు గలవారేకభావముతో గలసి పని చేయుటకవకాశములు లేని విధమును చెన్నరాష్ట్ర శాసనసభయందలి శ్రీయుత సత్యమూర్తిగారి ప్రవర్తనము వ్యక్తము చేసినది. సత్యమూర్తిగారు కమిటియందు సభ్యులుగ జేరుచున్నారు. ప్రభుత్వ సహాయము నపేక్షించెడి తీర్మానముల నామోదించుచున్నారు. దేశబంధుదాసుగారు లిట్టను ప్రభువువలయందు జిక్కుకొనక యధికారస్వీకారమును నిరాకరించుట సమంజసముగ నున్నది. వంగరాష్ట్రసభయందు 45 గురు స్వరాజ్యపక్షమువారు గలరు, అధికసంఖ్య గల స్వరాజ్యపక్షసహాయము లేకను లిట్టనుప్రభువు రాజ్యాంగరథము నెటులునడపగలడో కాలము వ్యక్తముచేయగలదు. సహకార ధర్మము నవలంబించుటకు 1. రాష్ట్రీయ స్వపరిపాలనమును 2. గాంధిమహాత్ముని విమోచన

మును 3. రాజకీయ నిర్బంధితుల విమోచనమును 4. నిర్బంధ శాసనముల సంహారమును దేశబంధు దాసుగారు గోరుట సమంజసమైనను స్వరాజ్యసిద్ధి వీనివలనను గలుగజాలదు. స్వరాజ్యపక్షము వా రన్ని సందర్భములందును నేవిధముగ వారిస్థితిని మార్చుకొనవలసివచ్చునదియును నీ సందర్భములు విశదముచేయుచున్నవి. సామ్రాజ్య శాసనసభయందు స్వరాజ్యపక్షమున కధికబలము గలుగు నని ఎన్నికల ఫలములు తెలుపుచున్నను పరిణామముమాత్రము సంశయాస్పదముగ నున్నది.

*　　*　　*　　*

చెన్నపురి రాష్ట్రమునందు ఎన్నికలు నూతనాకృతిని దాల్చినవి. మొదటి ఎన్నికలందు నిరాటంకముగ గెలిచినవారీ యెన్నికలందు విశేషశ్రమపడవలసివచ్చినది. జస్టిసు పక్షమువా రన్నిద్వారములను నధికారబలముచే బంధించినను ప్రజాభిప్రాయము కొంతవఱకు విశదమైనది. బ్రాహ్మణేతరపక్షము సహజముగ నిలిచియున్నను నిరంకుశత్వమును పోషించిన జస్టిసుపక్షమధోగతిపాలైనది. కట్టమంచి రామలింగారెడ్డిగా రుపపాదించిన "అవిశ్వాస తీర్మానము" ఓడిపోయినను జస్టిసు పక్షపు పస బయటపడినది. అధికారసభ్యులసహాయముతో మంత్రులు వ్యవహరించుట రాజ్యాంగధర్మమునకు విరుద్ధమైనను అధికారకాంక్ష యవినీతికి మూలమగుచున్నది. శ్రీరాజా పానుగంటి రామారాయనిం గారి మంత్రిత్వకాల మనతికాలముననె యంతము నొందిన విచిత్ర ముండదు. మోంటుఫర్డుసంస్కారణముల వైపరీత్యమును శాసనసభావ్యవహారక్రమము విస్పష్టము చేయుచున్నది.

*　　*　　*　　*

శ్రీయుత పండిత వంగూరి సుబ్బారావుగారి యొక్కయు శ్రీయుత కావ్యనిధి చెలికాని లచ్చారావుగారియొక్కయు అకాలమరణ మాంధ్రదేశమును దుఃఖాక్రాంతము చేసినది. లచ్చారావుగారి పోషణముక్రిందను సుబ్బారావుగారు భాషాసేవను జేయఁగలిగిరి. వీరిరువురును ఆంధ్రపరిశోధకమండలిని స్థాపించి భాషాభ్యుదయమునకుఁ దోడ్పడిరి. లచ్చారావుగారి యకాలాకస్మికమరణము సుబ్బారావుగారిమరణమునకు దోడ్పడినది. సుబ్బారావుగారు భారతి కెంతయో సహాయముచేయవలయునని తలఁచియుండిరి. భారతికి వారివ్యాసాలంకారమును బడయఁగల యదృష్టము గలుగలేదు. వీరిరువురును మృతులైనను వారి నామవిలాసములు చిరకాల మాంధ్రవాఙ్మయమునందు ప్రతిష్ఠను బడయుచుండఁగలవు. సదాశివుఁడు వీరియాత్మలకు శాంతిని వీరి కుటుంబములకు దుఃఖోపశమనమును ననుగ్రహించుగాక!

---

# గౌళ్ల చెల్లాయి కూతురు

అడివి బాపిరాజు గారు, బి. యే.

గౌళ్ల చెల్లాయి కూతురు
కడుచక్కందని జాతురు!
దానికళ్లు నీలిగుళ్లు
దానిపళ్లు మొగలిముళ్లు,
దాన్నిపలకరిస్తే వళ్లు
మోహానా గగురుపుళ్లు! గౌళ్ల.
వెండివడ్డాణం మొలకు
సన్నాగాజులు చేతులకు,
మెడను వేసెం దీ తీరు
పిల్లికాసులా పేరు! గౌళ్ల.

కల్లుకన్నా రుసి కలుగు
దానిపెదిమె కెంపువెలుగు,
దానిచేతిస్లీలు కొంటే
సొర్గాసౌఖ్య మేమిటంటే! గౌళ్ల.
డబ్బులిస్తూ వున్న వేళ
దిట్టరివాడైన తాళ,
లేక రాగి బిళ్ల బదులు
వెండిడబ్బు లిచ్చి కదులు! గౌళ్ల.

---

# తిరుపతి యాత్ర

నండూరి వేంకటసుబ్బారావు గారు, బి. యే.

యెంకి నాతోటీ రాయే!
మన
యెంకటేశరుణ్ణి యెల్లీ సూశొద్దాము
యెంకీ నాతోటీ రాయే!
ఆవుల్ని దూడల్ని
అత్తోరి కాడుంచి
మూటా ముల్లీ గట్టి
మావోళ్లతో సెప్పి యెంకీ నాతోటీ రాయే!
[illegible] మీదెన్నె
[illegible]కోట

కొండామెట్లన్ని నీ
కొంగట్టు కెక్కాలి యెంకీ నాతోటీ రాయే!
రేతిరి పగటేల
రెప్పెయ్య కెంకీని
సల్లంగ సూడమని
సామితో సెప్పాలి
యెంకీ నాతోటీ రాయే!
మన
యెంకటేశరుణ్ణి యెల్లీ సూశొద్దాము
యెంకి నాతోటీ రాయే!